ఓం

# శ్రీ హరితాళికా గౌరీ వ్రతము

## స్వర్ణగౌరీ వ్రతము

### వ్రత విధానము

ప్రతి సంవత్సరము వర్ష ఋతువు నందు భాద్రపద శుద్ధ తృతీయనాడు ఈ వ్రతమును ఆచరించవలెను. ఆనాడు ఉదయము కాలకృత్యములఁదీర్చుకొని - నువ్వులు, ఉసిరికాయతో కూడిన శుద్ధ ఉదకముతో స్నానముఁజేసి పట్టుబట్టలఁ గట్టుకొని - కుంకుమ బొట్టు పెట్టుకొనియు "మమ ఇహ జన్మని జన్మాంతరే చ భర్త్రాసహ అఖండిత సౌభాగ్య పుత్ర పౌత్రాద్యభీష్టప్రాప్తయే, ఐహిక ఆముష్మిక సకల ఫల సిద్ధ్యర్థం, శ్రీ సఖీసహిత - ఉమా మహేశ్వర దేవతా ప్రీత్యర్థం - ప్రతి వార్షిక విహితం హరితాళికా వ్రతం కరిష్యే" అని సంకల్పించవలెను.

ఇయ్యది - భవిష్యోత్తర పురాణమునందు కలదు. భవిష్యోత్తర మింక నిట్లు నిర్దేశించినది.

శ్లో॥ భాద్రే మాసి సితే పక్షే - తృతీయా హస్త సంయుతా ।
తదనుష్ఠాన మాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే ॥

'భాద్రపద శుద్ధ తృతీయ - హస్త నక్షత్రముతో కూడియుండవలెను. అట్టి శుభదినమున నీ వ్రతము నొనర్చినయెడల - పాపములన్నియు నశించును.

స్కాందమునందు ఈ వ్రతము స్వర్ణ గౌరీ వ్రతముగా పేర్కొనఁబడినది.

స్వర్ణ గౌరీవ్రతము అను నామాంతరము గల ఈ వ్రతము - బ్రాహ్మణ క్షత్రియ వైశ్య స్త్రీలకు ముఖ్యమైనది. శూద్ర స్త్రీలు. బ్రాహ్మణ సువాసినితో ఈ వ్రతమును చేయించి వ్రత ఫలమును పొందవచ్చును. ప్రతి వత్సరము - భాద్రపద శుద్ధ తృతీయనాడు ఈ వ్రతమును చేయుచు 17వ సంవత్సరమున ఉద్యాపనమును చేయవలెను. ఉద్యాపనముఁ జేయుటకు శక్తి లేనివారు జన్మాంతము వరకు



వ్రతము నాచరింపవలెను. పురుఁడు మొదలగు ఆటంకములు వచ్చినచో బ్రాహ్మణ సువాసినితో ఈ వ్రతమును చేయించవలెను. ఉద్యాపనము ఐన తరువాత - వ్రతాచరణము, ఉపవాసము మొదలగు వానికి ప్రాముఖ్యము లేదు గాన యథాశక్తి - నియమములతో అనగా - ఏకభుక్తము నక్తము ఇత్యాదుల నవలంబింపవచ్చును.

మహారాష్ట్ర దేశమునందీ వ్రతము నందరు చేయుచు ఉపవాసాది కఠిన నియమములను పాటించుట నిప్పటికిని గాననగును.

సర్వేజనా స్సుఖినో భవంతు.

### మండపము - విధానము

**నలుమూలలు ఆవు పేడతో అలికి శ్రీగంధోధకము చల్లి అరటిస్తంభములు, మామిడితోరణములతో మండపము స్థిరపరచి మంగళవాద్యములను మ్రోగించవలెను. మండపము నడుమ పీఠముపై రాగిపళ్లెరములో భస్మముతో 'ఓం'కారము వ్రాసి ఇసుకతో శివలింగమును, పసుపుతో గౌరమ్మను చేసి స్థాపించవలెను. ఈ లింగమును గౌరమ్మను ఉమామహేశ్వరులుగా భావించి సూచించిన భావముతో పూజలు చేసి వ్రతకథను చదివిగాని వినిగాని సకల కోర్కెలు తీర్చుకొనగలరు !**

శ్రీ

## హరితాళికా గౌరీ వ్రతమునకు పలయు సామగ్రి

పసుపు

కుంకుమ

విభూతి (భస్మము)

శ్రీగంధము

అక్షతలు

మామిడి కొమ్మలు

అరటి స్తంభాలు

మంచి బియ్యము - సేరుంబావు

రాగి - పెద్ద పళ్లెరము

పాలు, పెరుగు - తేనె - నెయ్యి - శర్కర (పంచామృతాలు)

నూతన వస్త్రములు (ధోవతి, ఉత్తరీయం - జాకిట్ బట్టలు రెండు)

పొకలు - పండ్లు (దొరికినన్ని రకాలు)

నానావిధ సుగంధ పుష్పములు 16 రకాలు

మారేడు పత్రి - మరియు 15 రకాల ఆకులు

16 రకాల దళములు లభించినచో ఉత్తరేణి ఆకులు సమర్పించవచ్చును

అగరువత్తులు (దశాంగము)

హారతి కర్పూరం

వత్తులు - మంచినూనె

మంగళహారతి పళ్లెం - మాణిక్యాలు రెండు

కలశ పూజకు చెంబు

గ్లాసు - ఉద్ధరిణి - పళ్లెరము

కూర్చుండుటకు ఆసనాలు



శంఖము - గంట - చెమ్మెలు

పీఠము

తోరణాలకు సుతిలీ

ఆవుపేడ - అలుకుటకు

ముగ్గుపిండి

మంగళవాద్యము - లేక - టేప్ రికార్డు

అరటిపండ్లు - తమలపాకులతో ముత్తైదువులకు (తాంబూలాలు)

టెంకాయలు - రెండు

శర్కర - ప్రసాదమునకు

అరటిపండ్లు - పచ్చి కొబ్బరి ముక్కలు

లింగము కొరకు ఇసుక

16 దారాలకు వేయబడిన 16 ముడుల గల (ముడులు కలుపుకొని) కుడిచేతి పొడవు గల దండను ధరించుట.

అమ్మవారి సొమ్ములు చేయుటకు స్వచ్ఛమైన దూది (ఒలిచిన పత్తి)

### ఉద్యాపనకు - సామగ్రి

16 చాటల వాయినాలు

వాయినాలలో - మంగళ సూత్రం, మెట్టెలు, అద్దం - దువ్వెన - కాటుక డబ్బి పసుపు డబ్బ - కుంకుమడబ్బ 16 కుడుములు 16 పదహారు పోగులతో పదహారు ముడులు మూరెడు పొడవు గల దండలు)

16 గురు ముత్తైదువులకు లేక - 16 సువాసినీ బ్రాహ్మణ దంపతులకు భోజనము - తాంబూలము - దక్షిణయు. పసుపు గౌరమ్మ. 16 గురు ముత్తైదువులకు - లేక 16 గురు దంపతులకు ధోతులు 16, లేక 16 ఉత్తరీయాలు 16 జాకిట్ బట్టలున్ను, వ్రతమునకై తేబడిన పసుపు కుంకుమ మొదలగు సామగ్రి మొత్తము చాటల వాయినాలలో - టెంకాయలు ఫలముగా సమర్పించుటయు;

# శ్రీ హరితాళికా గౌరి వ్రతము



## శ్రీరామా పబ్లిషర్స్

15-1-513, సిద్ధిఅంబర్ బజార్,
హైద్రాబాద్ - 500 012.

అథ

## శ్రీహరితాళికా ఉమామహేశ్వర
## అను స్వర్ణగౌరీ వ్రత పూజావిధానము

దీపం ప్రజ్వాల్య - గంధ కుంకుమ పుష్పై రభ్యర్చ్య - దీపము వెలిగించి గంధము, కుంకుమ పుష్పములను సమర్పించియు భో దీప ! బ్రహ్మరూప స్త్వం. జ్యోతిషాం ప్రభు రవ్యయః - ఆరోగ్యం ధన పుత్రాంశ్చ - స్థిరాం లక్ష్మీంచ దేహి మే, అనుచు దీపమునకు మ్రొక్కవలెను.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయే - సర్వవిఘ్నోపశాంతయే॥ 1

శ్లో॥ అగజానన పద్మార్కం - గజానన మహర్నిశం ।
అనేకదం తం భక్తానా - మేకదంత ముపాస్మహే ॥ 2

శ్లో॥ శివం శాంత ముమాకాంతం - కైలాస శిఖరాలయం ।
శరణ్యం సర్వలోకానాం - మహాదేవ ముపాస్మహే ॥ 3

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే - శివే సర్వార్థ సాధికే ।
శరణ్యే త్ర్యంబికే గౌరి - నారాయణి నమోఽస్తుతే ॥ 4

శ్లో॥ షణ్ముఖం గిరిజానంద - కందళం శిఖివాహనం ।
కుమారం సుకుమారం శ్రీ - కార్తికేయమహం భజే ॥ 5

శ్లో॥ సరస్వతీం మహాలక్ష్మీం - విష్ణుం బ్రహ్మాణ మవ్యయం ।
దక్షిణాస్య మహం వందే - మేధా ప్రజ్ఞా వివృద్ధయే ॥ 6

ఓం ఓం శ్రీ ఉమామహేశ్వరాభ్యాం నమః, శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః, శ్రీవాణీ హిరణ్యగర్భాభ్యాం నమః, శ్రీ శచీపురందరాభ్యాం నమః, శ్రీ సిద్ధి బుద్ధి

సమేతాయ గణాధిపతయే నమః, శ్రీ వల్లీ దేవసేనా సమేతాయ కుమార స్వామినే నమః, సమస్త దేవాతాభ్యో నమః. సర్వేభ్యః శైవబ్రాహ్మణేభ్యో నమః.

అనుచు అక్షతలు - శ్రీ ఉమామహేశ్వరులపై చల్లి - మ్రొక్కవలెను.

## ఆచమనము

శంభవే స్వాహా - శంకరాయ స్వాహా - శాంతాయ స్వాహా - అనుచు మూడు సారులు ఉద్ధరణితో కుడి అరచేతితో ఉదకము పుచ్చుకొనవలెను.

శాశ్వతాయ నమః అనుచు కుడి అరచేయిని కడిగికొనవలెను. మిగత ఈ క్రింది 20 నామములను చేతులు జోడించి ఉచ్చరింపవలెను.

శివ, స్థాణో, భవానీపతే, భూతేశ, త్రిపురాంతక, త్రినయన, శ్రీకంఠ, కాలాంతక, శర్వ, ఉగ్ర, అభవ, భర్గ, భీమ, జగతాంనాథ, అక్షయ, శ్రీనిధే, రుద్ర, ఈశాన, మహేశ, మహాదేవాయ నమః.

- లేక -

కేశవాది - చతుర్వింశతి (24) నామములను చెప్పవచ్చును.

## శ్రీ హరితాళికా గౌరీ పూజా విధానము

### ప్రాణాయామము

ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం - భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ - ఓమాపో జ్యోతీ రసో మృతం. బ్రహ్మ భూర్భువ స్సువరోమ్ ॥

అనుచు కుడిచేతితో చూపుడు వ్రేలు తాకకుండా ముక్కుకొనలు పట్టుకొని ఊపిరి ఎడమ ముక్కుతో పీల్చుచు మెల్లమెల్లగా - కుడిముక్కులో నుండి విడువ వలెను.

### సంకల్పము

శ్రీ శివ ! శివ! శంభో రాజ్ఞయా విష్ణో ర్నాభికమలాత్ ఉద్భూతస్య ఆద్య బ్రహ్మణో ద్వితీయపరార్ధే - శ్వేత వరాహకల్పే - వైవస్వత మన్వంతరే కలియుగే





- ప్రథమపాదే - జంబూద్వీపే - భరతవర్షే - భరతఖండే. అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన శ్రీ.................. నామ సంవత్సరే,................ అయనే........... ఋతౌ...................... మాసే.............. పక్షే............... తిథౌ........... వాసరే శుభవాసరే, శుభనక్షత్రే, శుభయోగే శుభకరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ - సమస్తదేవతాగురుచరణమాహేశ్వరసన్నిధౌ - శ్రీమాన్ .................. గోత్రః శ్రీమతః ....................... గోత్రస్య .................. నామధేయస్య మమభర్తు రనుజ్ఞయా - శ్రీమతీ ................ నామధేయా అహంశ్రీమత్యాః .................. నామధేయాయా మమ-భర్త్రాసహ అఖండితసౌభాగ్య సిద్ధిపూర్వకం - పుత్రపౌత్రప్రాప్త్యర్థం అన్యాన్యమనసిస్థితసమస్తాభీష్టసిద్ధ్యర్థం సర్వారిష్టప్రశాంత్యర్థం. దీర్ఘసౌమంగళ్య ప్రాప్త్యయే చ శ్రీహరితాళికా ఉమామహేశ్వరముద్దిశ్య - శ్రీహరితాళికా ఉమామేశ్వరప్రీత్యర్థం యథాశక్త్యుపచారైః ప్రతివార్షికవిహితం హరితాళికా ఉమామహేశ్వరపూజనం కరిష్యే. తదం గత్వేన భూ కలశ గణాధిపతి పూజనంచ కరిష్యే.

"భూ దేవతాయై నమః, సర్వోపచారార్థే అక్షతాన్ నమస్కారం చ సమర్పయామి

అనుచు భూమిపై అక్షతలు వేసి - నమస్కరించి దానిపై జలపూర్ణ కలశమును పూజింపవలెను.

### కలశపూజనము

శ్లో॥ కలశస్య ముఖే రుద్రః కంఠే విష్ణు స్సమాశ్రితః ।
మూలే తస్య స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాః శ్రితః ॥
కుక్షౌతు సాగరాస్సర్వే - సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః ॥

శ్లో॥ అంగైశ్చ సహితా స్సర్వే - కలశాంబు సమాశ్రితాః ।
అత్ర గాయత్రీసావిత్రీ- శాంతిపుష్టికరీ తథా ॥

శ్లో॥ ఆయాంతు గౌరీపూజార్థం - దురితక్షయకారకాః ।
గంగే చ యమునే కృష్ణే - గోదావరి సరస్వతి ॥
నర్మదే సింధుకావేర్యౌ - జలేஉ స్మిన్ సన్నిధిం కురు ॥

కలశస్థితవరుణాయ నమః - శ్రీగంధం అక్షతాన్ కుంకుమంపుష్పం బిల్వం శర్కరాం చ సమర్పయామి. అనుచు

కలశము చుట్టు పైనను కుంకుమతో అలంకరించి ఉదకములో శ్రీ గంధాదులను వేసి కలశముపై చేయిపెట్టి -

"స్థిరోభవ! వరదోభవ! మమ అభిసన్ముఖో భవ! చేయితీసి- కలశోదకేన పూజాద్రవ్యాణి ఆత్మానంచ సంప్రోక్ష్య - అనుచు కలశోదకమును పుష్పముతో పూజాద్రవ్యములపై తన (తమ) పైనను చల్ల (చల్లుకొన) వలెను.

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం - గమనార్థం తు రక్షసాం ।
కురు ఘంటా రవం తత్ర - దేవతాஉஉ హ్వానలక్షణమ్ ॥

ఘంటాయై నమః గంధాక్షతపుష్పాణి సమర్పయామి. అనుచు గంటకు గంధాక్షత పుష్పములు సమర్పించి మ్రోగించవలెను. తథైవ శంఖం సంపూజ్య పూరయేత్ - అట్లే శంఖమును పూజించి పూరించవలెను.

## గణపతిపూజనము

శ్లో॥ వక్రతుండ మహాకాయ - కోటి సూర్యసమప్రభ !
నిర్విఘ్నం కురుమే దేవ - సర్వకార్యేషు సర్వదా ॥

సుముఖాయ నమః = ధ్యాయామి. ఏకదంతాయ నమః - ఆవాహయామి కపిలాయ నమః ఆసనార్థే అక్షతాన్ సమర్పయామి. గజకర్ణకాయ నమః పాద్యం, లంబోదరాయ నమః అర్ఘ్యం, వికటాయ నమః ఆచమనీయంచ సమర్పయామి. విఘ్నరాజాయనమః - పంచామృతైః ఫలోదకేన చ అభ్యషించామి. గణాధిపాయ నమః శుద్ధోదకాభిషేకం విభూతించ సమర్పయామి. ధూమకేతవే నమః - వస్త్రోపవస్త్రార్థే ప్రతిష్ఠాపనార్థే యజ్ఞోపవీతార్థే ఆభరణార్థే చ అక్షతాన్ సమర్పయామి.





గణాధ్యక్షాయ నమః - శ్రీగంధం, ఫాలచంద్రాయ నమః - అక్షతాన్, గజాననాయ నమః - కుంకుమం సిందూరంచ సమర్పయామి. వక్రతుండాయ నమః - పుష్పాణి బిల్వంచ సమర్పయామి. శూర్పకర్ణాయ నమః ధూపం దీపంచ సమర్పయామి. హేరంబాయ నమః శర్కరాం నివేదయామి. స్కందపూర్వజాయ నమః - మహానీరాజనం సకర్పూరం ప్రదర్శయామి.

**"ఏకదంతాయ విద్మహే - వక్ర తుండాయ ధీమహి, తన్నోదంతిః ప్రచోదయాత్"**
**శ్రీ మహాగణాధిపతయే** నమః - మంత్రపుష్పం సమర్పయామి.

"ఓం నమో వ్రాతపతయే - నమో గణపతయే నమః ప్రమథపతయే - నమస్తే అస్తు లంబోదరాయ - విఘ్నవినాశినే శివసుతాయ వరదమూర్తయే నమోనమః, అనుచు నమస్కరింపవలెను.

అనయా పూజయా శ్రీ విఘ్నేశ్వరః ప్రీయతాం - అనుచు ఉదకము విడువవలెను. ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు.



## అథ గౌరీ (ఉమామహేశ్వర) పూజనమ్

### పవిత్ర చింతనము

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా - సర్వావస్థాం గతోఽపి వా ।
యః స్మరే ద్దేవ మీశానం - స బాహ్యాభ్యంతర శ్శుచిః ॥
అనుచు ఉమామహేశ్వరులకు మ్రొక్కవలెను.

ఆ పిమ్మట "ఇంద్రాయ నమః - అగ్నయే నమః - యమాయ నమః - నిఋతయే నమః - వరుణాయ నమః - వాయవే నమః - కుబేరాయ నమః - ఈశానాయ నమః అనుచు పోకలపై అష్టదిక్పాలకులను పూజింపవలెను.

ప్రాణప్రతిష్ఠాదుల నొనర్చి ధ్యానముఁ జేయవలెను

### ప్రాణప్రతిష్ఠామంత్రము

"రక్తాంభోధిస్థ పోతోల్లసదరుణ సరోజాధిరూఢా కరాగ్రైః ॥ పాశం కోదండ మిక్షూద్భవమణిగుణ మప్యంకుశం పంచబాణాన్ । బిభ్రాణాఽసృక్కపాలం త్రిణయనలసితా పీనవక్షోరుహాఢ్యా । దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరా నః ॥

"ప్రాం హ్రీం క్రోం య ర ల వ శ ష స హ ఓం - శ్రీహరితాళికా గౌరీ ప్రాణాఇహప్రాణాః - శ్రీహరితాళికా గౌరీ జీవఇహజీవః - వాఙ్మనఃశ్రోత్రాది సర్వేంద్రియాణి ఇహాగత్య సుఖేన చిరం తిష్ఠంతు స్వాహా".

"ఓం అనునీతే పున రస్మాసు చక్షుః పునః ప్రాణ మిహ నో దేహిభోగం జ్యోక్ పశ్యేమ సూర్య ముచ్చరంతమనుమతే మృడయానః స్వస్తి - అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వయతే"

శ్లో॥ స్వామిన్ సర్వజగన్నాథ - యావత్ పుజాఽవసానకం ।
తావత్త్వం ప్రీతిభావేన - లింగేఽస్మిన్ సన్నిధిం కురు ॥
స్థిరౌ వరదౌ భూత్వా సంప్రతిష్ఠితౌ భవేతామ్.

(అనుచు అక్షతలు వేసి నమస్కరింప వలెను)





### 1. ధ్యానము

ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ - పురుషం కృష్ణపింగళం,
ఊర్ధ్వరేతం విరూపాక్షం - విశ్వరూపాయ వై నమోనమః,

శ్లో॥ మందారమాలాఽఽకులితాలకా - కపాలమాలాంకితశేఖరాయ ।
దివ్యాంబరాయై చ దిగంబరాయ - నమఃశివాయైచ నమఃశివాయ ॥
"పీతకాశేయవసనాం - హిమకాంతిం కమలాసనాం ।
భక్తానాం వరదాం నిత్యం - పార్వతీం చింతయామ్యహమ్ ॥
శ్రీ హరితాళికా ఉమా మహేశ్వరాభ్యాం నమః ధ్యాయామి.

### 2. ఆవాహనము

శ్లో॥ దేవదేవి మహాదేవ - ప్రార్థయేఽహం జగన్మయౌ ।
ఇమాం పూజాం గృహీతుం వాం - ప్రార్థయే పరమేశ్వరౌ ॥
శ్రీహరితాళికా ఉమా మహేశ్వరాభ్యాం నమః ఆవాహయామి.

### 3. ఆసనము

శ్లో॥ సభవా త్వం మహాదేవీ! - సర్వసౌభాగ్యవర్ధినీ ।
అనేకరత్న సంయుక్త - మాసనం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీహరితాళికా ఉమా మహేశ్వరాభ్యాం నమః
దివ్యసింహాసనార్థే అక్షతాన్ సమర్పయామి.

### 4. పాద్యము

"ఓం ఏతానస్యమహిమా - అతో జ్యాయాగ్ శ్చపూరుషః
పాదోఽస్య విశ్వా భూతాని - త్రిపాదస్యామృతం దివి"

శ్లో॥ నిర్మలం శీతలం దివ్యం - నానాగంధ సమన్వితం ॥
పాద్యం గృహాణ దేవేశి సోమేన సహ పార్వతి ॥
శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః పాదాయోః పాద్యం సమర్పయామి

## 5. అర్ఘ్యము

"త్రిపాదూర్ధ్వ ఉదైత్ పురుషః పాదోఽ స్యేహాభవత్ పునః
తతోవిష్వఙ్ వ్యక్రామయత్. సాశనానశనేఅభి ॥

శ్లో॥ శ్రీపార్వతి మహాభాగే శంకర ప్రియవాదిని ! ।
అర్ఘ్యం గృహాణ కల్యాణి భర్త్రాసహ పతివ్రతే! ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః హస్తయో రర్ఘ్యం సమర్పయామి

## 6. ఆచమనీయము

"తస్మాద్విరాడజాయత విరాజో అధి పూరుషః
సజాతో అత్యరిచ్యత పశ్చాత్ భూమి మధో పురః"

శ్లో॥ గంగాజలం మయాఽఽనీతం - సువర్ణకలశేస్థితం ।
అనేనాచమ్యతాం దేవి - రుద్రేణసహితేఽనఘే ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః ముఖే ఆచమనీయం సమర్పయామి

## 7.మలాపకర్షణ స్నానము

"ఓం ఆపోహిష్ఠా మయోభువ - స్థానఊర్జేదధాతన
మహేరణాయ చక్షసే యోవశ్శివతమోరసః
తస్యభాజయతేహనః - ఉశతీరివమాతరః తస్మాతిరంగ
మామవో యస్యక్షయాయ జిన్వథ ఆపోజనాయథాచనః

శ్లో॥ గంగాసరస్వతీ రేవా - పయోష్ణీనర్మదాజలైః ।
స్నాపితాఽసిమయాయా దేవి - హరేణ సహ స్వీకురు ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః
మలాపకర్షణ స్నానం సమర్పయామి

## 8. పంచామృతస్నానము

శ్లో॥ సురభిస్తన సంభూతం సర్వదేవప్రియం పయః ।
చంద్రమండల సంకాశ దధి స్వాదు మనోహరమ్ ॥





"ఆజ్యం సురాణా మహార ఆజ్యం యజ్ఞే ప్రతిష్ఠితం ।
సర్వౌషధిసముత్పన్నం - పీయూషమధురం మధు ॥
ఇక్షుదండసముద్భూతం - శర్కరా మధురా విభో ॥
ఏభిః పంచామృతైః స్నాన మర్పయే జగదీశ్వరౌ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః (పాలు పెరుగు నెయ్యి తేనె శర్కర) పంచామృతై రభ్యషించామి.

## ఫలోధకస్నానము

శ్లో॥ నారికేళజలం శుద్ధం - దివ్యగంగాజలోపమం ।
యువయోః పాదయోః ప్రీత్యా - హ్యర్పయామి మహేశ్వరౌ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః నారికేళఫలోదకేన అథవా ద్రాక్షా ఫలరసేన స్నపయామి.

## పంచోపచారపూజనము

లం పృథివీతత్త్వాభ్యాం శివాభ్యాం నమః శ్రీగంధం అక్షతాంశ్చ సమర్పయామి
హం ఆకాశతత్త్వాభ్యాం శివాభ్యాం నమః పుష్పాణి బిల్వదళాని సమః ॥
యం వాయుతత్త్వాభ్యాం శివాభ్యాం నమః - ధూపం ఆఘ్రాపయామి.
రం అగ్నితత్త్వాభ్యాం శివాభ్యాం నమః - దీపం ప్రదర్శయామి
సం సర్వతత్త్వాభ్యాం శివాభ్యాం నమః - నైవేద్యం సమర్పయామి

అనుచు గంధము అక్షతలు పుష్పములు మారేడు దళములు ధూపము దీపము శర్కరా నైవేద్యము సమర్పించి నమస్కరింపవలెను.

'అనేన పంచోపచార పూజనేన శ్రీఉమామహేశ్వరౌ ప్రీయేతామ్" అనుచు - ఉద్ధరిణితో ఉదకము పళ్లెరములో విడువవలెను.

ఉత్తరే నిర్మాల్యం విసృజ్య - ఉమామహేశ్వరులపై గల పూలుపత్రి తీసి కనుల కద్దుకొని - పళ్లెరములో విడిచియు మహాభిషేకమును చేయవలెను.

## 9. మహాభిషేకము

వైదికులు - దేవీసూక్తపురుషసూక్త నమకచమకములతో - ఇదిరానివారు శివమహిమ్నః స్తోత్రముతో - వటవేళ్ల శ్రీగంధము కస్తూరి జవ్వాజి మొదలగు పరిమళవస్తువులు కలిసినట్టి శుద్ధోకముతో ఉమామహేశ్వరు (పసుపు గౌరమ్మ, ఇసుకలింగము)ల నభిషేకించవలెను.

## దేవీ సూక్తము

"ఓం సహ నా వవతు - సహ నౌ భునక్తు - సహ వీర్యం కరవావహై - తేజస్వినా వధీత మస్తు - మా విద్విషావహై - ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేవై దేవా - దేవీ ముపతస్థుః - కాఽసీతి త్వం మషదేవీతి సాఽబ్రవీత్ - అహం బ్రహ్మస్వరూపిణీ మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్. శూన్యం చాశూన్యంచ. అహమానందానందౌ అహంవిజ్ఞానావిజ్ఞానే. అహంబ్రహ్మాబ్రహ్మణీ వేదితవ్యే అహం పంచభూతానపంచ భూతాని. అహమఖలం జగత్. వేదోఽహం - విద్యాఽహ మవిద్యాఽహం - అజాఽహమనజాఽహం - అధశ్చోర్ధ్వంచ తిర్యక్చాహం. అహంరుద్రేభి ద్వసుభిశ్చరామి. అహ మాదిత్యైరుత విశ్వదేవైః అహం మిత్రావరుణావుభౌ బిభర్మి అహమింద్రాగ్నీ-అహమశ్వినౌ భా. అహం త్వష్టారం పూషణం భగం దధామి. అహం విష్ణు మురుక్రమం బ్రహ్మాణముత - ప్రజాపతిం దధామి. అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే. అహం రాష్ట్రీ సంగమనీ వసూనాంచికితుషీ ప్రథమా యజ్ఞియానాం. అహం సువే పితరమస్య మూర్ధన్మమయోని రప్స్వంతః సముద్రే. య ఏవం వేద స దైవీం సంపదమాప్నోతి తే దేవా అబ్రువన్ - నమో దేవ్యై మహాదేవ్యై - శివాయై సతతం నమః - నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మ తామ్ తామగ్నివర్ణాం తపసాజ్వలంతీం వైరోచనీం కర్మఫలేషు జుష్టాం దుర్గాం దేవీం శరణమహం ప్రపదామహేఽసురాన్ నాశయిత్ర్యై తే నమః. దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాం పశవో వదంతి - సానో మంద్రేష



శ్రీ హరితాళికా - గౌరీ వ్రతము

మూర్జం దుహానా - ధేను ర్వాగస్మానుపసుష్టుతైతు - కాళరాత్రీం బ్రహ్మస్తుతాం - వైష్ణవీం స్కందమాతరం - సరస్వతీమదితిం - దక్షదుహితరం - నమామః పావనాం శివామ్ - మహాలక్ష్మైచ విద్మహే - సర్వశక్త్యైచ ధీమహి. తన్నోదేవీ ప్రచోదయాత్. అదితిర్హ్యజినిష్ట దక్షయా దుహితా తవ తాం దేవా అన్వజాయంత భద్రా అమృత బంధవః - కామో యోనిః కమలా వజ్రపాణిః గుహా హ సా మాత రిశ్వాఽభ్రమింద్రః పునర్గుహా సకలా మాయయా చ పురూర్వైషా విశ్వమాతాఽఽదివిద్యోమ్. ఏషాఽఽత్మశక్తిః ఏషా విశ్వమోహినీ పాశాంకుశ ధనుర్బాణధరా - ఏషాశ్రీ మహావిద్యా య ఏవం వేద స శోకం తరతి॥ నమస్తే అస్తు భగవతి మాత రస్మాన్ పాహి సర్వతః సైషాఽష్టౌ వసవః సైషైకాదశ రుద్రాః సైషా ద్వాదశాదిత్యాః సైషా విశ్వేదేవాః సోమపా అసోమపాశ్చ - సైషా యాతుధానా అసురా రక్షాంసి పిశాచా యక్షాః సిద్ధాః సైషా సత్త్వరజస్తమాంసి సైషా బ్రహ్మవిష్ణుఃరుద్రరూపిణీ. సైషా ప్రజాపతీంద్రమనవః సైషా గ్రహనక్షత్ర జ్యోతీంషి కళాకాష్ఠాది కాలరూపిణీ తామహం ప్రణౌమి నిత్యమ్.

పాపపహారిణీందేవీం భుక్తిముక్తి ప్రదాయినీం। అనంతాం విజయాం శుద్ధాం - శరణ్యాం శివదాం శివామ్॥ వియదీకారసంయుక్తం వీతిహోత్ర సమన్వితం। అర్ధేందులసితం దేవ్యా బీజం సర్వార్థసాధకమ్॥ ఏవ మేకాక్షరం బ్రహ్మ - యతయః శుద్ధచేతసః ధ్యాయంతి పరమానందమయా జ్ఞానాంబురాశయః॥ వాఙ్మయా బ్రహ్మసూస్తస్మాత్ - షష్ఠం వక్త్రసమన్వితం సూర్యోఽవామశ్రోత్ర బిందుసంయుక్త ష్టాత్తృతీయకం - నారాయణేన సమ్మిశ్రో వాయుశ్చాధరయుక్ తతః విచ్చే నవార్ణకోఽర్ణస్స్యాత్ - మహదానంద దాయకః - హృత్పుండరీక మధ్యస్థాం - ప్రాతస్సూర్యసమప్రభాం - పాశాంకుశ ధరాం సౌమ్యాం - వరదాభయహస్తకాం - త్రినేత్రాం రక్తవసనాం భక్తకామదుఘాం భజే॥ నమామి త్వాం మహాదేవీం మహాభయ వినాశినీం మహాదుర్గ ప్రశమనీం - మహాకారుణ్యభూషిణీమ్॥

యస్యాస్స్వరూపం బ్రహ్మాదయోనజానంతి తస్మాదుచ్యతే అజ్ఞేయా - యస్యా అంతో న లభ్యతే. తస్మాదుచ్యతే అనంతా యస్యా లక్ష్యం నోపలభ్యతే. తస్మాదుచ్యతే అలక్ష్యా - యస్యా జననం నోపలభ్యతే - తస్మా దుచ్యతే అజా ఏకైవ సర్వత్ర వర్తతే తస్మాదుచ్యతే ఏకా - ఏకైవ విశ్వరూపిణీ - తస్మాదుచ్యతే నైకా - అతఏవోచ్యతే అజ్ఞేయా, అనంతా, అలక్ష్యా, అజా, ఏకా, నైకేతి, మంత్రాణాం మాతృకాదేవీ శబ్దానాం జ్ఞానరూపిణీ - జ్ఞానానాం చిన్మయాతీతా - శూన్యానాం శూన్యరూపిణీ - యస్యాః పరతరం నాస్తి సైషా దుర్గా ప్రకీర్తితా । తాం దుర్గాం దుర్గమాం దేవీం దురాచారవిఘాతినీం । నమామి భవభీతోఽహం సంసారార్ణవ తారిణీమ్ ॥

### ఫలశ్రుతి

ఇద మథర్వశీర్షం యోఽధీతే - స పంచాథర్వశీర్ష జపఫలమవాప్నోతి ఇదమథర్వశీర్ష మజ్ఞాత్వా యోఽర్చాం స్థాపయతి. శతలక్షం జప్త్వాఽపి సోఽర్చాసిద్ధిం నవిందతి - శత మష్టోత్తరం చాస్య పురశ్చర్యావిధిః స్మృతః - దశవారం పఠేద్యస్తు సద్యః పాపైః ప్రముచ్యతే మహాదుర్గాణి తరతి - మహాదేవ్యాః ప్రసాదతః సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి. ప్రాత రధీయానో రాత్రికృతం పాపంనాశయతి. సాయం ప్రాతః ప్రయుంజానో అపాపో భవతి. నిశీథే తురీయ సంధ్యాయాం జప్త్వా వాక్సిద్ధిర్భవతి. నూతనాయాం ప్రతిమాయాం జప్త్వా దేవతాసాన్నిధ్యం భవతి. ప్రాణప్రతిష్ఠాయాం జప్త్వా ప్రాణానాంప్రతిష్ఠా భవతి. భౌమాశ్విన్యాం మహాదేవీసన్నిధౌ జప్త్వా - మహామృత్యుం తరతి - స మహామృత్యుం తరతి య ఏవం వేద - ఇత్యుపనిషత్.

"ఓం సహనావవతు = మావిద్విషావహై" ఓం శాంతిః శాంతిః శాంతిః

నమస్తే అస్తు భగవన్ విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్నిరుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీ మహాదేవాయ నమః" అనుమంత్రముతో నభిషేకింపవలెను.





అమృతాభిషేకోఽస్తు - సువర్ణాభిషేకోస్తు - రత్నాభిషేకోఽస్తు

సర్వారిష్టశాంతిరస్తు - సర్వాభీష్టసిద్ధిరస్తు హరహర మహాదేవ !

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః మహాభిషేకం సమర్పయామి

మహాభిషేకస్నానాంతరం వస్త్రోపవస్త్రార్థే అక్షతాన్ అథవా ప్రత్యక్ష వస్త్రోపవస్త్రే సమర్పయామి.

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః
యజ్ఞోపవీతార్థే చ అక్షతాన్ సమర్పయామి.

### 10. భస్మధారణము

"అగ్నిరితి భస్మ వాయురితి భస్మ జలమితి భస్మ - స్థలమితి భస్మ, వ్యోమేతి భస్మ - సర్వగ్ం హవా ఇదగ్ం భస్మ"

**శ్లో॥ విభూతిం భూతిదాం దేవి - శంభో భక్త్యా సమర్పయే ।**
**లలాటే యువయో ర్ధార్యాం - భుక్తిముక్తి ప్రదాయినీమ్ ॥**

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః భస్మ సంధారయామి

### 11. శ్రీగంధము

"గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం
ఈశ్వరీగ్ం సర్వభూతానాం - తా మిహోపహ్వయే శ్రియమ్ ॥

**శ్లో॥ శ్రీఖండం చందనోన్మిశ్రం గంధాఢ్యం సుమనోహరం ।**
**విలేపనం సురశ్రేష్ఠా - ప్రీత్యర్థం ప్రతి గృహ్యతామ్ ॥**

శ్రీహరితాళికా ఉమా మహేశ్వరాభ్యాం నమః శ్రీ గంధం సమర్పయామి.

## 12. అక్షతలు

"అయనే తే పరాయణే - దూర్వా రోహంతు పుష్పిణీః -

హ్రదాశ్చ పుండరీకాని - సముద్రస్య గృహా ఇమే"

శ్లో॥ అక్షతాంశ్చ సురశ్రేష్ఠా కుంకుమాక్తాన్ సుశోభితాన్ ।

గృహ్ణీతాం దేవదేవేశా మయా దత్తాన్ హి భక్తితః ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః అక్షతాన్ సమర్పయామి

## 13. ధాన్యసమర్పణము

శ్లో॥ పితామహసముద్భూతం సర్వజీవవివర్ధనం ।

ధాన్య గృహాణ భగవన్ - యథోక్తఫలదోభవ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః సప్తధాన్యాని సమర్పయామి

## 14. పసుపు కుంకుమలు

"ఓం అహిరివ భోగైః పర్యేతి బాహుం - జ్యాయా హేతిం పరిబాధమానః హస్తఘ్నో విశ్వా వయు నాని విద్వాన్ పుమాన్ పుమాగ్ంసం పరిపాతు విశ్వతః"

శ్లో॥ హరిద్రా పీతవర్ణాచ - సర్వసౌభాగ్యదాయినీ ।

హరిద్రయాఽర్చితే దేవీ - సంతుష్టా మేఽస్తు సర్వదా ॥

శ్రీ హరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః హరిద్రాం (పసుపు) సమర్పయామి

శ్లో॥ కుంకుమం కామికం శుభ్రం కామినాం కామసంభవం ।

కుంకుమేనార్చితే దేవి వరదా భవ సర్వదా ॥

శ్రీ హరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః కుంకుమం సమర్పయామి





## 15. తాడపత్ర (కమ్మలు) సమర్పణము

శ్లో॥ తాడపత్రద్వయం దేవి కంఠాభరణసంయుతం ।

స్వర్ణరత్నమయం శుభ్రం - పార్వతి ప్రతి గృహ్యతామ్ ॥

శ్రీ హరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః

తాడపత్ర (తాటంక) యుగళం కంఠాభరణం చ సమర్పయామి.

కమ్మలు, కంఠాభరణము ప్రత్యక్షముగా సమర్పించు శక్తి లేనిచో "తాటంక కంఠాభరణార్థే అక్షతాన్ సమర్పయామి" అనుచు అక్షతలు అమ్మవారిపై వేయవలెను.

"కంకణ సిందూరాది సౌభాగ్యసుగంధిద్రవ్యాణి సమర్పయామి" అనుచు గాజులు, సిందూరము అత్తరు పన్నీరు మొదలగు సుగంధ ద్రవ్యములను అమ్మ వారికి సమర్పించవలెను.

## 16. పుష్పసమర్పణము

"తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్

"కాత్యాయనాయ విద్మహే - కన్యకుమారి ధీమహి -

తన్నో దుర్గి ప్రచోదయాత్"

శ్లో॥ మాల్యాదీని సుగంధీని - మాలత్యాదీని చ ప్రభో ।

మయాఽఽహృతాని పూజార్థం పుష్పాణి ప్రతిగృహ్యతామ్ ॥

సేవంతికావకుళచంపకపాటలాబ్జైః పున్నాగ జాతి

కరవీర రసాల పుష్పైః బిల్వప్రవాళ తులసీదళమాలతీభి-

స్త్వాం పూజయామి జగదీశ్వరి మే ప్రసీద -

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః నానావిధపుష్పాణి సమర్పయామి

## అంగపూజనము

త్ర్యంబకాయ నమః ఉమాయై నమః - పాదౌ పూజయామి

భైరవాయ నమః గౌర్యైనమః - గుల్ఫౌ (మడిమలు) పూజయామి

కామారయే నమః కాళికాయై నమః - జంఘే (మోకాళ్లు) పూజయామి

నాగయజ్ఞోపవీతినే నమః భద్రకాళ్యై నమః - ఊరూ (తొడలు) పూజయామి

దేవదేవాయ నమః విశ్వరూపిణ్యై నమః - హృదయం పూజయామి

ఈశ్వరాయ నమః కౌమార్యై నమః - బాహూ పూజయామి

శర్వాయ నమః చండికాయై నమః - హస్తౌ పూజయామి

మహేశ్వరాయ నమః చాముండాయై నమః - కంఠం పూజయామి

వ్యోమకేశాయ నమః మహాలక్ష్మ్యై నమః - ముఖం పూజయామి

రుద్రాయ నమః మహాసరస్వత్యై నమః - నాసికాం పూజయామి

ఉమాపతయే నమః కమలాయై నమః - నేత్రే పూజయామి

పినాకినే నమః లోకమాత్రే నమః - లలాటం పూజయామి

కపాలభృతే నమః కైలాసశిఖరవాసిన్యై నమః- శిరః పూజయామి

సర్వవ్యాపకాయ నమః సర్వవ్యాపిన్యై నమః - సర్వాంగం పూజయామి

అనుచు ఆ యా అవయవములపై పుష్పములు లేక అక్షతలు, ఇసుక లింగమునకు పసుపు గౌరమ్మకు సమర్పించవలెను.

గౌరీ అష్టోత్తర శతనామములను శివ అష్టోత్తర శతనామములను చదువుచు పుష్పాలు లేక కుంకుమ సమర్పించవలెను. శివునకు బిల్వదళాలు లేక పొడిభస్మంతో కూడిన అక్షతలు.





## శ్రీహరితాళికాగౌరీ అష్టోత్తరశత (108) నామావళి

అంగపూజ తరువాత ఈ నామములను పఠించుచు పుష్పాలు లేక కుంకుమను సమర్పించవలెను.

ఓం అస్య శ్రీ గౌరీ అష్టోత్తరశతనామస్తోత్రమంత్రస్య బ్రహ్మఋషిః పంక్తి శ్ఛందః - గౌరీ దేవతా - శివాయై నమః ఇతి కీలకం జగన్మాత్రే నమ ఇతి బీజం -మమ దీర్ఘసౌమంగళ్య ప్రాప్త్యర్థే అర్చనే వినియోగః

హ్రీ మితి కరాంగన్యాసం విధాయ - భూర్భువస్సువ రోమితిదిగ్బంధః ఇతి దిగ్బంధం కృత్వా ధ్యాయేత్.

"హ్రీం అనుదానితో కరాంగన్యాసమునొనర్చి - ఎడమచేతిచూపుడు వ్రేలుపై కుడిచేతి చూపుడు వ్రేలు పెట్టి దిగ్బంధముచేసి దిగువ మంత్రముతో ధ్యానము గావింపవలెను.

"సర్వమంగళమాంగళ్యే - శివే సర్వార్థసాధికే !
శరణ్యే త్ర్యంబకే గౌరి - నారాయణి నమోஉస్తు తే"

(ప్రతి నామము మొదట "ఓం" అనియు; చివర "నమః" అని పలుకవలెను)

ఓం గౌర్యై నమః
గణేశజనన్యై
గిరిరాజతనూభవాయై
గుహాంబికాయై
జగన్మాత్రే
గంగాధరకుటుంబిన్యై
వీరభద్రప్రసువే
విశ్వవ్యాపిన్యై

ఓం విశ్వరూపిణ్యై నమః
అష్టమూర్త్యాత్మికాయై (10)
కష్టదారిద్ర్యశమన్యై
శివాయై
శాంభవ్యై
శంకరానందదాయిన్యై
బాలాయై
భవాన్యై
భద్రదాయిన్యై

ఓం మాంగళ్యదాయిన్యై నమః
సర్వమంగళాయై
మంజుభాషిణ్యై (20)
మహేశ్వర్యై
మహామాయాయై
మంత్రారాధ్యాయై
మహాబలాయై
హేమాద్రిజాయై
హైమవత్యై
పార్వత్యై
నారాయణ్యై
నిత్యాయై (30)
నిరీశాయై
నిర్మలాయై
అంబికాయై
మృడాన్యై
మునిసంసేవ్యాయై
మానిన్యై
మేనకాత్మజాయై
కుమార్యై
కన్యకాయై
దుర్గాయై (40)
కలిదోషనిషూదిన్యై
కాత్యాయన్యై
కృపాపూర్ణాయై

ఓం కల్యాణ్యై నమః
కమలార్చితాయై
సత్యై
సర్వమయ్యై
సౌభాగ్యదాయై
సరస్వత్యై
కమలాయై
అమరసంసేవ్యాయై (50)
అన్నపూర్ణాయై
అమృతేశ్వర్యై
అఖిలాగమసంస్తుతాయై
సుఖసచ్చిత్సుధారసాయై
బాల్యారాధిత భూతిదాయై
భానుకోటిసముద్యుతయే
హిరణ్మయ్యై
పరాయై
సూక్ష్మాయై
శీతాంశుకృతశేఖరాయై (60)
హరిద్రాకుంకుమారాధ్యాయై
సర్వకాలసుమంగళ్యై
సర్వభోగప్రదాయై
సామగానప్రియాయై
వేదాంతలక్షితాయై
కర్మబ్రహ్మమయ్యై
కామేశ్వరకళాయై





ఓం కాంక్షితార్థదాయిన్యై నమః
చంద్రార్కాయితతాటంకాయై
చిదంబరశరీరిణ్యై (70)
శ్రీచక్రవాసిన్యై
దేవ్యై
కామేశ్వర్యై
కళాయై
మారారిప్రియార్ధాంగ్యై
మార్కండేయవరప్రదాయై
పుత్రపౌత్రాభివర్ధిన్యై
పుణ్యాయై
పురుషార్థఫలదాయై
సత్యధర్మరతాయై (80)
సర్వసాక్షిణ్యై
శతశశాంకరూపిణ్యై
శ్యామలాయై
బగళాయై
చండ్యై
మాతృకాయై
భగమాలిన్యై
శూలిన్యై

ఓం విరజాయై నమః
స్వాహాయై (90)
స్వధాయై
ప్రత్యంగిరాంబికాయై
ఆర్యాయై
దాక్షాయణ్యై
దీక్షాయై
సర్వవస్తూత్తమోత్తమాయై
శివదూత్యై
శ్రీవిద్యాయై
ప్రణవార్థస్వరూపిణ్యై
హ్రీంకార్యై (100)
నాదరూపాయై
త్రిపురాయై
త్రిగుణాత్మికాయై
సుందర్యై
షోడశాక్షర మహామంత్రాయై
స్వర్ణగౌర్యై
హరితాళికాయై
ఇచ్ఛా జ్ఞానక్రియా శక్త్యై నమః (108)

శ్రీ హరితాళికా గౌర్యై నమః - పుష్పైః రథవా కుంకుమేన సంపూజయామి

## శ్రీ శివ అష్టోత్తర శత (108) నామావళి

ఓం అస్యశ్రీ శివాష్టోత్తరశతనామస్తోత్ర మంత్రస్య తండి ఋషిః, అనుష్టుప్, ఛందః - సదాశివో దేవతా - శివాయ నమ ఇతి కీలకం - పరమాత్మనే నమ ఇతి బీజం - మమ దీర్ఘాయురారోగ్యభాగ్యప్రాప్త్యర్థే - అర్చనే వినియోగః

"ఓం" అనుదానితో కరాంగన్యాసమును ఎడమచూపుడు వ్రేలుపై కుడిచూపుడు వ్రేలుపెట్టి దిగ్బంధము నొనర్చి - దిగువ ధ్యానశ్లోకమును చదువవలెను.

**శ్లో॥** **ధవళ వపుష మిందోర్మండలే సన్నివిష్టం**
**భుజగ వలయహారం భస్మదిగ్ధాంగ విమిామ్ ।**
**హరిణ పరశు పాణిం చారుచంద్రార్ధమౌళిం**
**హృదయకమలమధ్యే సంతతం చింతయామి ॥**

ప్రతి నామమునకు "ఓం" మొదట, "నమః" చివర చదువవలెను.

ఓం శివాయ నమః
మహేశ్వరాయ
శంభవే
పినాకినే
శశిశేఖరాయ
వామదేవాయ
విరూపాక్షాయ
కపర్దినే
నీలలోహితాయ
శంకరాయ (10)
శూలపాణయే
ఖట్వాంగినే
విష్ణువల్లభాయ
శిపివిష్టాయ

ఓం అంబికానాథాయ నమః
శ్రీకంఠాయ
భక్తవత్సలాయ
భవాయ
శర్వాయ
త్రిలోకేశాయ (20)
శితికంఠాయ
శివాప్రియాయ
ఉగ్రాయ
కపాలినే
కామారయే
అంధకాసురసూదనాయ
గంగాధరాయ
లలాటాక్షాయ





ఓం కాలకాలాయ నమః
కృపానిధయే (30)
భీమాయ
పరశుహస్తాయ
మృగపాణయే
జటాధరాయ
కైలాసవాసినే
కవచినే
కఠోరాయ
త్రిపురాంతకాయ
వృషాంకాయ
వృషభారూఢాయ (40)
భస్మోద్ధూళితవిగ్రహాయ
సామప్రియాయ
స్వరమయాయ
త్రయీమూర్తయే
అనీశ్వరాయ
సర్వజ్ఞాయ
పరమాత్మనే
సోమసూర్యాగ్నిలోచనాయ
హవిషే
యజ్ఞమయాయ (50)
సోమాయ
పంచవక్త్రాయ
సదాశివాయ
విశ్వేశ్వరాయ
వీరభద్రాయ

ఓం గణనాథాయ నమః
ప్రజాపతయే
హిరణ్యరేతసే
దుర్ధర్షాయ
గిరీశాయ (60)
గిరిశాయ
అనఘాయ
భుజంగభూషణాయ
భర్గాయ
గిరిధన్వనే
గిరిప్రియాయ
కృత్తివాసనే
పురారాతయే
భగవతే
ప్రమథాధిపాయ (70)
మృత్యుంజయాయ
సూక్ష్మతనవే
జగద్వ్యాపినే
జగద్గురవే
వ్యోమకేశాయ
మహాసేనజనకాయ
చారువిక్రమాయ
రుద్రాయ
భూతపతయే
స్థాణవే (80)
అహిర్బుధ్న్యాయ
దిగంబరాయ

| | | | |
|---|---|---|---|
| ఓం | అష్టమూర్తయే నమః | ఓం | హరయే నమః |
| | అనేకాత్మనే | | పూషదంతభిదే |
| | సాత్త్వికాయ | | అవ్యగ్రాయ |
| | శుద్ధవిగ్రహాయ | | దక్షాధ్వరహరాయ |
| | శాశ్వతాయ | | హరాయ (100) |
| | ఖండపరశవే | | భగనేత్రభిదే |
| | అజాయ (90) | | అవ్యక్తాయ |
| | పాశవిమోచకాయ | | సహస్రాక్షాయ |
| | మృడాయ | | సహస్రపాదే |
| | పశుపతయే | | అపవర్గప్రదాయ |
| | దేవాయ | | అనంతాయ |
| | మహాదేవాయ | | తారకాయ |
| | అవ్యయాయ | | శ్రీ పరమేశ్వరాయ నమః (108) |

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః - అష్టోత్తరశత నామభిః (పృథక్ - పృథక్) పుష్పాణి - కుంకుమంచ సమర్పయామి

## 15. పత్రపూజనము

ఉమాయై నమః బిల్వపత్రం సమర్పయామి. గౌర్యై నమః. దూర్వాపత్రం (ప్రతిదానికి సమర్పయామి అనవలెను.) కాళికాయై నమః. తులసీ పత్రం భద్రకాళ్యై నమః జాతీ (జాజిమల్లె) పత్రం; విశ్వరూపిణ్యై నమః సేవంతికా (చామంతి) పత్రం; కౌమార్యై నమః వేణు (వెదురు) పత్రం; చండికాయై నమః. మరువక పత్రం; చాముండాయై నమః. దాడిమీ (దానిమ్మ) పత్రం; మహాలక్ష్మైనమః - నింబ (నిమ్మ) పత్రం; మహాసరస్వత్యై నమః. వకుళ పత్రం మహాకాళ్యై నమః. దేవదారు పత్రం; కమలాయై నమః. చంపక (చంపక) పత్రం; దైత్యవిధ్యంసిన్యై నమః. కరవీర (గన్నేరు) పత్రం; లోకమాత్రే నమః.





ముని పత్రం; కైలాసవాసిన్యై నమః భృంగరాజ (గుంటగరిజే) పత్రం; సర్వవ్యాపిన్యై నమః. మాతులుంగ (మాదీఫలంచెట్టు) పత్రం సమర్పయామి.

## 18. ధూపము

"యో వై రుద్ర స్స భగవాన్ యశ్చవాయుః భూర్భువస్సువ స్తస్మై రుద్రాయ నమో అస్తు

శ్లో॥ దేవద్రుమ రసోద్భూతః - కృష్ణాగురుసమన్వితః ।
ఆఘ్రేయః సర్వదేవానాం - ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః దూపమాఘ్రాపయామి

## 19. దీపము

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతోభాంతి
కుతోఽయమగ్నిః - తమేవభాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి"

శ్లో॥ త్వం జ్యోతి స్సర్వ దేవానాం తేజసాం తేజ ఉత్తమం ।
ఆత్మజ్యోతిః పరంధామ దీపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః దీపం ప్రదర్శయామి
ధూపదీపానంతరం శుద్ధం ఆచమనీయం సమర్పయామి

## 20. నైవేద్యము

"ఓం భూర్భువ స్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్" సత్యం త్వర్తేన (ప్రాతః) ఋతం త్వా సత్యేన (సాయం) పరిషించామి" అనుచు నైవేద్యముపై ఉదకముచల్లి చుట్టు త్రిప్పవలెను"

శ్లో॥ అన్నం చతుర్విధం స్వాదు - రసైః షడ్భి స్సమన్వితం ।
భక్ష్య భోజ్యాది సంపన్నం - నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః మహానైవేద్యం సమర్పయామి
అథవా తత్కాలే నారికేళశ్కరరాదికం సమర్పయామి.
(మహానైవేద్యం సిద్ధముగా లేనిచో కొబ్బరి
శర్కర మున్నగువానిని నివేదింపవలెను)

నైవేద్య మధ్యే పానీయం, ఉత్తరాపోశనం. హస్తప్రక్షాళనం ముఖప్రక్షాళనం కర్వోద్వర్తనార్థే చందనం చ సమర్పయామి.

అనుచు నాలుగు పర్యాయములు ఉద్ధరిణితో ఉదకము చూపి విడిచి శ్రీగంధం చిలుకరింపవలెను.

## 21. ఫలసమర్పణము

శ్లో॥ ఇదం ఫలం మయా దేవ - స్థాపితం పురతస్తవ ।
తేన మే సుఫలావాప్తి ర్భవేదిహ పరత్ర చ ॥

శ్రీ హరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః నారికేళద్రాక్షాదిఫలం సమర్పయామి

శ్లో॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం ।
కర్పూరైలా లవంగైశ్చ తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః తాంబూలం సమర్పయామి

## 22. దక్షిణ

శ్లో॥ హిరణ్యగర్భ గర్భస్థం హేమ బీజం విభావసోః ।
అనంతపుణ్యఫలద మతః శాంతిం ప్రయచ్ఛ మే ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః స్వర్ణపుష్పదక్షిణాం సమర్పయామి





## 23. భూషణములు

శ్లో॥ వజ్రమాణిక్య వైదూర్య - ముక్తా విద్రుదు మండితం ।
పుష్పరాగసమాయుక్తం - భూషణం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీహరితాళికా గౌర్యై నమః - కంఠహార కంకణ కాంచీ నూపురాది భూషణాని సమర్పయామి.

అనుచు బంగారుసొమ్ములను సమర్పించి పూజాంతమున తీసికొన వచ్చును.

బంగారుసొమ్ములు లేనిచో - పరిశుభ్రమైన దూదితో సొమ్ములు చేసి సమర్పించవచ్చును.

## 24. మహా నీరాజనము

ఓం శ్రియే జాతః శ్రీ ఆనిర్యాయ శ్రియం వయో జనితృభ్యో
దదాతి శ్రియం వసానా అమృతత్వ మాయన్ - భవంతి సత్యా
సమిదా మితద్రౌ - శ్రియ ఏవైనం తచ్ఛ్రియా మాదధాతి - సంతతమృచా
వషట్కృత్యం సంతత్యై సంధీయతే ప్రజయా పశుభి ర్య ఏవం వేద"

శ్లో॥ చంద్రాదిత్యౌచ ధరణీ - విద్యుదగ్ని స్తథైవ చ ।
త్వమేవ సర్వజ్యోతీంషి - హార్తిక్యం ప్రతిగృహ్యతామ్ ॥

### మంగళహారతి (స్వవిరచితము)

మంగళ మిహతే శ్రీ - మహాదేవి హరితాళికే ॥
మంగళ మిహతే ॥ ధ్రువకము ॥

దక్షాధ్వరగత దివిషత్ - పక్షగర్వపరిహారిణి ।
మోక్షమార్గసంధాయిని - హ్యక్షయసహచారిణి శ్రీ॥ ॥ మం ॥ 1

చంద్రబింబ సమవదనే - మందస్మిత సంభాషిణి ।
చంద్రమౌళికృతనటనా - నందభరితహృదయే సతి॥ ॥ మం ॥ 2

వీరభద్రకార్తికేయ విఘ్నేశ్వర మాతృరూపే ।
పర్వతాధిరాజ తనయే పార్వతి మాం పరిపాలయ॥ ॥ మం ॥ 3

సోమశేఖర సహపూజితే - కామజీవన సంధాయిని ।
రామనాథసుత మధ్యమ - ప్రేమారాధితపదకమలే ॥ ॥ మం ॥ 4

ప్రతివత్సర భాద్రశుక్ల - తృతీయాయాం విధానతః ।
ప్రీతిపూజన కర్తృణాం - సుతధనసౌభాగ్యదాయిని ॥ ॥ మం ॥ 5

## కర్పూర నీరాజనము

శ్లో॥ కర్పూరగౌరం కరుణావతారం
సంసారసారం భుజగేంద్ర హారమ్ ।
సదా వసంతం హృదయారవిందే
భవం భవానీసహితం నమామి ॥

శ్లో॥ మందార మాలాంఽకిత మస్తకాయై -కపాలమాలాంఽకిత కంధరాయ ।
దివ్యాంబరాయై చ దిగంబరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥

శ్రీ హరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః. మహానీరాజనం కర్పూర నీరాజనం చ సమర్పయామి.

అనుచు మంగళహారతిని ప్రదర్శించి - కర్పూరము వెలిగించి చూపియు - ఉద్ధరిణితో ఉదకమును నీరాజనంచుట్టు త్రిప్పి విడువవలెను. గంట మ్రోగించవలెను.

## 25. మంత్రపుష్పము

"ఓం తత్పురుషాయ విద్మహే - మహాదేవాయ ధీమహి - తన్నో రుద్రః ప్రచోదయాత్"





"ఓం కాత్యాయనాయ విద్మహే - కన్యకుమారి ధీమహి - తన్నో దుర్గి ప్రచోదయాత్"

శ్లో॥ నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః ।
నమో దేవాయ మహతే మంత్రపుష్పం సమర్పయే ॥

(సద్యోజాతం = సదాశివోమ్, అను పంచబ్రహ్మమంత్రములను "సహస్రశీర్షం" "తామగ్నివర్ణాం" ఇత్యాదులను చదువవచ్చును).

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః - మంత్రపుష్పం (అంజలినా దోసిలితో) సమర్పయామి.

## 26. నమస్కారము

"ఓం నమో హిరణ్యబాహవే - హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ హిరణ్యపతయేఽంబికాపతయ ఉమాపతయే నమోనమః"

శ్లో॥ నమో దేవ్యై మహాదేవ్యై - శివాయై సతతం నమః ।
నమో భర్గాయ శర్వాయ ప్రాణినాం పతయే నమః ॥

శ్రీ హరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః నమస్కారాన్ సమర్పయామి

## 27. ప్రదక్షిణము

శ్లో॥ యాని కానిచ పాపాని - జన్మాంతరకృతానిచ ।
తాని తాని వినశ్యంతి ప్రదక్షిణ పదేపదే ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః ప్రదక్షిణాన్యనుతిష్ఠామి
అనుచు ముమ్మారు ప్రదక్షిణముఁ జేయవలెను.

## 28. క్షమాపణము

శ్లో॥ ఆవాహనం న జానామి న జానామి విసర్జనం ।
పూజాం చైవ న జానామి క్షమ్యతాం పరమేశ్వరా ॥

శ్లో॥ "భక్త్యాకృతం తు యద్దేవి పూజనం తవ సువ్రతం ।
కృపయా తేఽద్య తత్సర్వం పరిపూర్ణం స్యాత్సురేశ్వరి ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః - క్షమాపయామి

## 27. యాచ్నా (యాచించుట)

శ్లో॥ రూపం దేహి జయం దేహి దేహి పుత్రాన్ ధనం చ మే ।
సౌభాగ్యం దీర్ఘమాయుశ్చ సౌమంగళ్యం ప్రదేహి చ ।
అన్యాన్ సర్వకామాంశ్చ దేహి దేవి నమోఽస్తు తే ।

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః యాచయామి

## విసర్జనము

అనేన ప్రతివార్షిక విహితేన - యథాశక్తి కృతేన సప్తవింశత్యుపచార పూజనేన - శ్రీసఖీ సహిత ఉమామహేశ్వర దేవతా ప్రీయతాం ప్రీతా సుప్రసన్నా వరదా భవతు.

## ఆర్ఘ్యత్రయప్రదానము

శ్లో॥ గంధాక్షతసమాయుక్తం - ఫలపుష్పసమన్వితం ।
హిరణ్యసహితం దేవి ఆర్ఘ్యం మే ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః ప్రథమార్ఘ్యం సమర్పయామిః

శ్లో॥ హిమాలయసుతే దేవి - సర్వసౌభాగ్యదాయిని ।
మయా సమర్పితం తుభ్య మర్ఘ్యం సంప్రతిగృహ్యతామ్ ॥

శ్రీహరితాళికా ఉమామహేశ్వరాభ్యాం నమః ద్వితీయార్ఘ్యం సమర్పయామిః

శ్లో॥ సర్వదేవస్తుతే దేవి దుర్గే దైత్యవినాశిని ।
భక్త్యా దత్తం మయా తుభ్య మర్ఘ్యం స్వీకురు సత్తమే ॥

శ్రీహరితాళికా - ఉమామహేశ్వరాభ్యాం నమః తృతీయార్ఘ్యం సమర్పయామి





## వాయన ప్రదానము

"పూర్వోక్త ఏవంగుణ విశిషే అభ్యుదయముహూర్తే మమ యథోక్త ఫలప్రాప్త్యర్థం శ్రీసఖీ సహిత ఉమామహేశ్వరదేవతా ప్రీత్యర్థం బ్రాహ్మణాయ సౌభాగ్యవాయనప్రదానం కరిష్యే, అని సంకల్పించి బ్రాహ్మణుని గంధాక్షత పుష్పాదులతో పూజించియు దిగువ మంత్రముతో (బియ్యం, దక్షిణ - బంగారము - నూతన వస్త్రములు ఫలము అనువానిని పాత్రలో ఉంచి, వాయనము నీయవలెను.

శ్లో॥ అన్నం సువర్ణం పాత్రస్థం - సవస్త్రఫలదక్షిణం ।
వాయనం గౌరి ! విప్రాయ = దదామి తవ ప్రీతయే ॥
సౌభాగ్యారోగ్యకామ్యానాం - సర్వసంపత్సమృద్ధయే ॥
- గౌరీ గిరీశ తుష్ట్యర్థం - వాయనం తే దదామ్యహమ్ ॥

ఇదం సౌభాగ్యవాయన ప్రదానం తుభ్యమహం సంప్రదదే.
దాన సాంగతా సిద్ధ్యర్థ మిమాం దక్షిణాం తుభ్య మహం సంప్రదదే - ప్రతిగృహ్యతాం - ప్రతిగృహ్ణామి.

అనుచు - బ్రాహ్మణునకు వాయనమునిచ్చి "ప్రతిగృహ్ణామి" అనిపించుకొని బ్రాహ్మణుని చేతిలో ఉదకమును విడిచి మ్రొక్కవలెను.

పూజావిధానము సమాప్తము

## శ్రీ హరితాళికా గౌరీ కథావృత్తాంతము

### భవిష్యోత్తరపురాణప్రోక్తము

**సూత ఉవాచ**

**శ్లో॥** మందార మాలాఽకులితాలకాయై - కపాల మాలాంఽకిత కంధరాయ । దివ్యాంబరాయై చ దిగంబరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ ॥

**శ్లో॥** కైలాసశిఖరే రమ్యే గౌరీ పృచ్ఛతి శంకరం ।
గుహ్యాత్ గుహ్యతరం వృత్తం కథయస్వ మహేశ్వర ॥ 1
సర్వేషాం సర్వధర్మాణా - మల్పాయాసం మహత్ఫలం ।
ప్రసన్నోఽసి యదానాథ - తథ్యం బ్రూహి మమాగ్రతః ॥ 2

**శ్లో॥** కేన త్వం హి మయా ప్రాప్త - స్తపోదాన వ్రతాదినా ।
అనాదిమధ్యనిధనో - భర్తాచైవ జగత్ప్రభుః ॥

నైమిషారణ్యమునందు పన్నెండేండ్ల జన్నముజేయుచున్నట్టి శౌనకాది మహర్షుల, గూర్చి - వారి విశ్రాంతి సమయమున వారి మనోగతమును కనుగొని సూతమహాముని ఇట్లు చెప్పఁదొడఁగెను.

కైలాసమున వెండికొండయొక్క మహోన్నతశిఖరముపై గల దివ్య మణిమయ భవనమున రత్నసింహాసనమునందు పార్వతీపరమేశ్వరులు సుఖాసీనులై యుండిరి. అట్టితతి పార్వతీదేవి ఇట్లు ప్రశ్నించెను.

శంకరా! రహస్యములలో రహస్యమైన వృత్తాంతమును నాకెఱిగింపుము! అది ఏదనఁగా? దేవమానవాదులు ఆచరింపవలసిన ధర్మములన్నిటిలో - అల్పాయాసము మహత్ఫలంబు గల యథార్థమును ప్రసన్నుఁడవై నాకు వక్కాణింపుము !

ఎట్టి తపోదానవ్రతాదులతో - ఆదిమధ్యాంతములు లేనట్టి జగన్నాథుఁడవు నగు నీవు భర్తగా నాకు లభించితివి?





ఈశ్వర ఉవాచ - పరమేశ్వరుఁడు చెప్పఁదొడఁగెను.

**శ్లో॥** శృణు దేవి ప్రవక్ష్యామి - తవాగ్రే వ్రత ముత్తమం ।
యద్గోప్యం మమ సర్వస్వం - కథయామి శుభప్రదమ్ ॥

దేవీ! ఉత్తమవ్రతమును నీ ముందు విశదీకరించుచున్నాను. అయ్యది - నా సర్వాధికారముతో సమానమగు స్థితి నొసఁగునదై నాయందు భక్తిలేనివారికి దాగియుండునది. భక్తులకు శుభము నొసఁగూర్చు నదియునై యున్నది. నక్షత్రములలో చంద్రుఁడు, గ్రహములలో సూర్యుఁడు; వర్ణములలో బ్రాహ్మణుఁడు; దేవతలలో నారాయణుఁడు; నదులలో గంగా మహానది; పురాణములలో మహాభారతము; వేదములలో సామవేదము; ఇంద్రియములలో మనస్సు; శ్రేష్ఠములైనట్లు నే చెప్పఁబోవు వ్రతము - వ్రతములలో గొప్పదగును. ఆ వ్రతము నాచరించియే నా అర్ధాసనమును సంపాదించితివి! నీవు నాకు ప్రియమైనదానవగుటచే పూర్వకాలమున జరిగినదంతయు చెప్పుచున్నాను. సావధానురాలవై వినుము! నీవు అట్టి వృత్తాంతమును విస్మరించినావుగాన చెప్పవలసివచ్చినది.

**శ్లో॥** భాద్రే మాసి సితే పక్షే - తృతీయా హస్తసంయుతా ।
తదనుష్ఠానమాత్రేణ - సర్వాన్ కామాన్ సమాప్నుయాత్॥ 10

భాద్రపద మాసమున శుక్లపక్షమునందు హస్తనక్షత్రముతో కూడిన తదియనాడు ఈ వ్రతము నాచరించినంత మాత్రమున - కోరికలన్నిటిని పొందవచ్చును.

### వ్రతాచరణ విధానమెట్లనఁగా?

నీ తండ్రియగు హిమవంతుని నిలయముగు పర్వతశ్రేష్ఠము - విశాల ప్రదేశములు - పుష్పితసుగంధ వృక్షములు పలు తెఱఁగుల పక్షులు- నానావిధమృగములు ఇత్యాదులతో మిగుల రాణించునదని నీకు తెలియునుగదా!

హిమాలయముపై దేవతలు గంధర్వులు సిద్ధులు, చారణులు, గుహ్యకులు సంతోషముతో ఎల్లకాలము విహరించుచుందురు. వారిలో గంధర్వుల సంగీతములు మనోహరములుగా నుండును. మణులు వైఢూర్యములు అనువానితో నలంకరింపఁబడిన స్ఫటిక మయములు - సువర్ణమయంబులు నగు సమున్నత శిఖరములతో హిమాలయము ఆకాశము నంటినట్లుండుటే గాక మంచునిండినదై గంగామహానదీ ప్రవాహముతో ధ్వనించుచుండెను.

**శ్లో॥ పార్వతి త్వం యధా బాల్యే - పర మాచరతీ తపః ।**
**అబ్దద్వాదశకం దేవి - ధూమ్రపాన మధోమఖీ ॥ 17**

**శ్లో॥ సంవత్సరచతుష్షష్టిం - పక్వపర్ణాశనం కృతం ।**
**మాఘమాసే జలే మగ్నా - వైశాఖే చాగ్నిసేవినీ ॥ 18**

**శ్లో॥ శ్రావణే చ బహిర్వాసా - అన్నపాన వివర్జితా ।**
**దృష్ట్వా తాతేన తత్కష్టం - చింతయా దుఃఖితోఽభవత్ ॥ 19**

పార్వతీ! నీవు చిన్నతనమున గొప్ప తపస్సు నాచరించితివి. ఎట్లనఁగా? క్రిందు ముఖముతో పొగఁదాగుచు పన్నెండు వత్సరములు తపించితివి. అరువదినాలుగు సంవత్సరములు పండుటాకులు తినుచును, మాఘమాసమున నీటియందు కంఠమువరకు మునిగియు వైశాఖమాసమున నాలుగు అగ్నుల మధ్య నిలువఁబడి సూర్యునవలోకించుచు - శ్రావణమాసమున పరువుబండపై పరుండియు - అన్నపానములను విడనాడి శివషడక్షర మహామంత్రమును జపించుచు నన్ను ధ్యానించితివి. నీ తండ్రి హిమవంతుఁడు ఇట్టి నీ కష్టమును చూచి - చింతాక్రాంతుఁడై దుఃఖపడెను. మరియు ఈ నా కూతురును ఏ మహానుభావునకు సమర్పించవలెనని ఆలోచించుచుండగా ధర్మజ్ఞుఁడు బ్రహ్మమానసపుత్రుఁడునగు నారదమహర్షి - పార్వతీదేవిని చూడఁదలచినవాడై యచ్చోటున కఱుదెంచెను.





హిమవంతుడు అర్ఘ్య పాద్యాదులతో తనను సత్కరింపగా నారదుఁడు. విష్ణుమూర్తి నీకడకు నన్ను పంపెను. ఎందుకనఁగా? యోగ్యమైన కన్యారత్నమును యోగ్యునకొసఁగుట - న్యాయముగాన - బ్రహ్మేంద్రాదులలో వాసుదేవునితో సమానుఁడైన పురుషోత్తముఁడు లేడని - గుర్తించి - నీ పుత్రికను నారాయణునకు వివాహవిధిని సమర్పించుము ! ఇది నా యభిమతము అని వచించెను.

అంత హిమవంతుఁడు నారద వచనము నాలకించి వాసుదేవుఁడు తననోట నా కుమార్తెను కోరుటవలన నీవు వచ్చి చెప్పుటవలనను నా పుత్రికను గోవిందునకే ఇచ్చెదనని వాగ్దానము నొనర్పగా నారదుఁడు విని - ఆకసమున అంతర్ధానముఁ జెందెను. (కనుమఱుఁగయ్యెను).

పిదప - నారదమహర్షి వైకుంఠమున కేగి కృతాంజలియై "దేవా! నీ శుభవాంఛ సిద్ధించినదని" విన్నవించెను. అంత హిమవంతుఁడు - "పుత్రీ! నిన్ను గరుడధ్వజునకు ఇచ్చి వివాహము నొనర్తునని నారదునితో సందేశమును పంపినాను, అని వచింపగా నీవు (పార్వతీదేవి) విని - బెంగతో చెలికత్తె యింటికి వెళ్లి - అతి దుఃఖముతో నేలపై పడి - హా హతాఽస్మి-అని విలపించుచుంటివి.

"ఎందుకు దఃఖించెదవు? నీ కోరిక ఏదియో తెలిపినచో నేనద్దానిని ఫలింపఁ జేయుదునని చెలికత్తె నుడవుగా నీవు (పార్వతీదేవీ) సఖీ! మహాదేవుని భర్తగా బడయవలె, నను నా వాంఛితమును నా తండ్రి వ్యర్థముఁజేసినందున ప్రాణత్యాగమును గావింపవలెనని నిశ్చయించితిని, అని వచించితివి.

నీ (పార్వతీ) వాక్యమును సఖి యాలకించి "దేవీ! నీ జననీజనకులకు తెలియనట్టి వనమునకు ఇరువురుము వెళ్లెదము" అని వచింపగా - నీవు సమ్మతించినందున అట్టి వనమునకు గొంపోవబడితివి. అంత నీ జనకుఁడు. ఓషధిప్రస్థపురమున ఇంటింట నిన్ను వెదకించినను నీవు దొరుకనందున "పుత్రీ! దేవదానవకిన్నరాదులలో ఎవరు నిన్నపహరించిరి? నారాయణునకు నిన్ను ఇచ్చెదనని నారదునిద్వారా అందజేయఁబడిన వాగ్దానము నెట్లు చెల్లింపవలెను?"

అని చింతించుచు మూర్ఛితుఁడై క్రిందఁబడగా - అప్పులందరు హాహాకారములతో పరుగిడుచు వచ్చి - గిరిరాజును సమీపించి దుఃఖకారణము నడిగిరి. అంత హిమవంతుడు "నా కన్యారత్నము నెవరు అపహరించినారో; మహాసర్పముచే కరువఁబడినదో; సింహవ్యాఘ్రాదులచే సంహరింపఁబడినదో; ఏ దుర్మార్గుఁడు నా కుమార్తె నెత్తుకొని పోయినాడో జంఝామారుతముతో వృక్షమువలె తాను వణకుచు వచించెను. ఐన నూఱటఁజెందక నిన్నుచూడవలెనని - సమస్త వనములలో సంచరించుచు - సింహ వ్యాఘ్ర భల్లూకాది క్రూరమృగములచే నిండిన మహావనముఁజేరెను. అచ్చోట ఒకానొక నదియొక్క తీరమున గల గుహలో సఖితో కూడ ప్రవేశించి నిరాహారివై - ఇసుక లింగమును స్థాపించి నీ మూలరూపమగు జగదంబతోకూడ నన్ను భాద్రపదశుద్ధ తృతీయనాడు హస్తనక్షత్రమున నన్నారాధించి - గీత వాద్యములతో రాత్రిని జాగరణముఁ జేసితివి. ఇట్టి వ్రతరాజము యొక్క మహిమచే నా సింహాసనము కదిలినందున - నే నచ్చోటున కేతెంచి - ప్రసన్నుఁడ నైతిని. వరము నడుగుము" అని యనుగ్రహింపగా - నీవు

**శ్లో॥ యది దేవ ప్రసన్నోఽసి భర్తా భవ మహేశ్వర! ॥**

"దేవా! మహేశ్వరా! ప్రసన్నుఁడవైతివేని - నాకు భర్తవు కమ్మని ప్రార్థించితివి.

**శ్లో॥ తథేత్యుక్త్వా తు సంప్రాప్తః - కైలాసం పునరేవ చ ॥**

"అట్లే అగుగాక! అని వచించి కైలాసముఁ జేరితిని.

ఆ పిమ్మట చవితినాడు ప్రాతఃకాలమున ఇసుక లింగమును నదీజలమున విసర్జించి సఖితో కూడ భోజనము నొనర్చితివి. హిమవంతుఁడా మహావనములో నలుదిసలఁబాఱఁజూచి - నదీతీరమందు నిద్రించి యున్న కన్యకల నిద్దఱిఁ గాంచెను. "క్రూరజంతుభరితము భయంకరంబునగు నీ వనమునందు ఎందుకుంటివి" అని హిమవంతుఁడడుగగా - నీవు "నాయనా! విష్ణువునకు





నన్నిచ్చెదవని బాధపడి నేనీ మహావనమున కేతెంచితిని. "మహేశ్వరునకు నన్నిచ్చునెడల - గృహమునకు వచ్చెదను. లేనిచో ఇచ్చోటనే నివసించెదను" అని వచించితివి.

"నీవు కోరిన మహేశ్వరునకే నిన్ను ఇచ్చెద" నని హిమవంతుడు నీకభయము నొసఁగి స్వగృహమునకు నిన్ను నీసఖితో కూడ తీసికొని వెళ్లెను. ఆ తరువాత వివాహవిధిని నిన్ను నాకు మేనకా హిమవంతులు త్రికరణశుద్ధి గలవారై సమర్పించిరి.

**శ్లో॥ తేన వ్రతప్రభావేన - సౌభాగ్యం సాధితం త్వయా ।**

**అద్యాపి వ్రతరాజస్తు - న కస్యాపి నివేదితః ॥ 53**

**శ్లో॥ నామాస్య వ్రతరాజస్య - శృణు దేవి యథాఽభవత్ ।**

**ఆలిభిర్హరితా యస్మాత్ - తస్మాత్సా హరితాళికా ॥ 54**

పూర్వోక్తవ్రతప్రభావము వలన నన్ను భర్తగా బడసి దీర్ఘసౌమంగళ్యాది సౌభాగ్యమును సాధించితివి. ఇంతవరకు నేనీ వ్రతరాజము నెవరికి నుపదేశింపక కాపాడి ఉంచితిని. ఇఁక నీ వ్రతమునకు ఈ పేరు ఎందుకు వచ్చినదో చెప్పుచున్నాను. "ఆలిభిః = చెలికత్తెచేత; హరితా = హరింపబడినదానవై ఇద్దాని నాచరించితివిగాన దీనికి "హరితాళికావ్రతము" అను నామధేయము ప్రసిద్ధమైనది" అని మహేశ్వరుఁడు ప్రబోధింపగా - పార్వతీదేవి యిట్లు ప్రశ్నించెను.

దీనికి గల పేరు చెప్పగా వింటిని. ఐతే ఈ వ్రతముఁదగు విధానమును, పుణ్యమును ఫలమును ఎట్టివారు చేయవలయునో వక్కాణింపుము !

అంత మహేశ్వరుఁడు - దిగువవిధము వాక్రుచ్చెను.

ముత్తైదువులకు సౌభాగ్యమును పెంపొందించు నీ వ్రతవిధానమును వినుము! సౌభాగ్యము నాకాంక్షించు సువాసిని చేయవలసిన వ్రతమిది.

స్వగృహమున లేక శివక్షేత్రమున - లేక నదీతీరమున ఒకానొక పవిత్ర ప్రదేశమును చతురశ్రము (నలుమూలలుగా) ఆవుపేడతో అలికి శ్రీగంధోదకమును చల్లియు అరటిస్తంభములతో మామిడిఆకుల తోరణములతోడను మండపమును (పందిరిని) సిద్దపఱచి - శంఖభేరీమృదంగముల (శంఖము తప్పెట మద్దెల మున్నగవాని)తో మంగళధ్వనులను మ్రోగింపఁజేయవలెను. మరియు మండపము ముందు - నానావిధములైన మంగళగీతములను పాడించవలెను. మండపము నడుమ పీఠముపై రాగిపళ్లెరములో భస్మతో వ్రాయఁబడిన ఓంకారముపై ఇసుకతో చేయబడిన శివలింగమును పసుపుగౌరమ్మతో సహస్థాపించవలెను. అనేక విధములైన పుష్పములతో శ్రీగంధ దూపదీపాదుల తోడను, భక్ష్యభోజ్యలేహ్యపానీయాది వివిధ నైవేద్యముల తోడను ఉమామహేశ్వరులను పూజించి ఆనాడు రాత్రి జాగరణఁ జేయవలెను.

నారికేళము (టెంకాయ)లు, పూగీఫలము (పోక)లు, దానిమ్మలు, ఆయా ఋతువులయందు ఫలించునవియు నగు నానావిధ స్వాదుమధుర ఫలములను సమర్పించవలెను.

దిగువ మంత్రములతో ఉపచారముల నన్నిటిని సమర్పించవచ్చును.

**"నమశ్శివాయ శాంతాయ - పంచవక్త్రాయ శూలినే,**
**నంది భృంగి మహాకాల - గణనాథాయ శంభ వే,** **63**

**"శివాయై హరకాంతాయై - ప్రకృత్యైసృష్టిహేతవే,**
**శివప్రదాయై మాంగళ్య - సౌభాగ్యదాత్ర్యై తే, నమోనమః.** **64**

**"శివే కల్యాణదే నిత్యం శివరూపే నమోఽస్తు తే,**
**శివశక్తే నమ స్తుభ్య ముమాయై సతతం నమః,** **65**

**"నమస్తే బ్రహ్మచారిణ్యై - జగద్ధాత్ర్యై నమోనమః,**
**సంసారభయ సంతాపా త్త్రాహి మాం సింహవాహిని** **66**





**"యేన కామేన దేవి త్వం - పూజితాఽసి మహేశ్వరి !**
**తం కామం దేహి మే దేవి - రాజ్య సౌభాగ్యదాయిని!"** **67**

అనుచు పూజించి ప్రార్థింపవలెను.

మరియు నీ వ్రతముఁజేయు ముత్తైదువ - తన భర్తతో సహ ఈ కథను ఏకాగ్రచిత్తముతో వినవలెను. ఇట్లు నీ వ్రతము నాచరించినచో పాపములన్నియు తొలగుటయేగాక ఏడుజన్మలవరకు రాజ్యము సౌభాగ్యంబు లభించి వర్థిల్లును.

**శ్లో॥ తృతీయాయాం తు యానారీ - ఆహారం కురుతే యది ।**
**సప్తజన్మసు స్యా ద్వంధ్యా - వైధవ్యం ప్రాప్నుయా ద్ధ్రువమ్ ॥**
**"దారిద్ర్యం పుత్రశోకంచ - కర్కశా దుఃఖభాగినీ ॥** **72**

భాద్రపదశుద్ధతృతీయనాడు - వ్రతస్థురాలై - అన్నాది ఆహారమును భుజించినచో - రాబోవు ఏడు జన్మలయందు గొడ్రాలై వితంతువగును. మరియు దరిద్రురాలై పుత్రదుఃఖము గలదై కనికరములేని కఠినచిత్తురాలునై - ఎల్లకాలము కష్టపడునదగును. (భోజనముఁజేయగూడదు కాని పాలు పండ్లు నిరాహారం వస్తువులు (సగ్గు బియ్యం) మొదలగువానిని తీసికొనుట ఉపవాసముతో సమానమగును).

## వాయన ప్రదానము

బంగారము లేక వెండి లేక రాగి లేక వెదురు లేక మట్టిపాత్రయందు బియ్యము, నూతన వస్త్రములు, దక్షిణ అను వాని నునిచి - సద్బ్రాహ్మణునకు దానము నొసఁగియు మరునాడు తాను కుటుంబ సభ్యులందరితో కూడ భోజనము నొనర్పవలెను.

**శ్లో॥ ఏవం వ్రతం యా కురుతే చ నారీ - త్వయా సమానా**
**రమతే చ భర్త్రా! - భోగా ననేకాన్ భువి భుజ్యమానా**
**సాయుజ్య మంతే లభతే హరేణ ॥ మయేతి శేషః**

"ఇట్లు వ్రతమును భక్తిశ్రద్ధలతో గావించు వనిత - నీతో సమానురాలై తన భర్తతో చిరకాలము సుఖపడును. మరియు నీ భూలోకమున అనేక సుఖముల ననుభవించి అంత్యకాలమున శివసాయుజ్య (శాశ్వతమోక్ష) ము నొందును. భర్తనుగూడ తరింపఁజేయును.

వేలకొలది అశ్వమేధయాగములను - నూర్లకొలది వాజపేయ యజ్ఞములను - వ్రతము నాచరించి - వ్రతకధను వినినచో - చేసిన ఫలము లభించును.

"దేవీ! ఇట్లు నీ వ్రతమును వక్కాణించితిని. దృఢవిశ్వాసముతో ఆచరింపఁబడు నీ వ్రతము కోటియజ్ఞఫలముల నొసఁగునదై - శ్రీహరితాళికా - ఉమామహేశ్వర - ప్రీతి జనకమగునని - మహేశ్వరుఁడు పార్వతీదేవికి వచించినట్లు సూతమహాముని శౌనకాది మహర్షులకు ప్రబోధించి విశ్రాంతికై విరమించెను.

**ఇతి శ్రీ భవిష్యోత్తర పురాణే హరితాళికావ్రత కథాప్రవచనం సమాప్తమ్.**

**సర్వం శ్రీ ఉమామహేశ్వర చరణారవిందార్పణమస్తు**

**ఓం తత్సత్**

